# ప్రవేశిక

"అడవి" కావ్యసంపుటిని ప్రచురించిన తర్వాత, 1950 నుండి నేటివరకు నేను వ్రాసిన ఖండకావ్యాలను కొన్నిటిని కూర్చి "భువన ఘోష" పేరుతో విశాలాంధ్ర ప్రచురణాలయము వారు ప్రచురిస్తున్నారు. దేశంలో కావ్యసాహిత్యానికి తగినంత ఆదరణ, తత్ఫలితమైన ప్రోత్సాహమూ క్షీణిస్తున్న యీ రోజులలో, కవి ఎవ్వడూ సొంతపూచీమీద కావ్యాలు ముద్రించుకొనలేక పోతున్నాడు. మరి, ప్రచురణసంస్థలు నవలా సాహిత్యానికి, నాటకాలకు యిస్తున్న ప్రోత్సాహం కావ్యకర్తలకు యివ్వలేకపోతున్నవి. కావ్య సాహిత్యం పట్ల పఠితృలోకంలోయేర్పడిన యీ నిర్లక్ష్యభావానికి కారణాలేమిటి ? నా వుద్దేశ్యంలో అవి యివి.

ఒకటి, పఠితలకు సంప్రదాయసిద్ధ కావ్యధోరణులపట్ల వెగటు పుట్టింది. అభ్యుదయ కావ్యధోరణులపట్ల యింకా రుచియేర్పడలేదు. ఇది పాఠకుల తప్పుకాదు. కావ్యధోరణుల లోటుపాట్లే యిందుకు కారణం. పాతలోకొత్తలేదు. కొత్తలో పాతలేదు. రెండింటికి యిచ్చి పుచ్చుకోళ్లులేవు. ఎన్నడో లాక్షణికు లేర్పరచిన మానదండాల ననుసరించి, వస్తువులోనూ, రీతిలోనూ నిరుత్సుకమైన జడిమకు లోబడి, వర్తమాన యుగావసరాలనేమి, జనహృదయాన్నేమి ధ్వనించక, శబ్దాలంకారాలు అర్థాలంకారాలు గాడిదమోతకాగా, ఐహికాలను లెక్కించక, లేదా ఇహలోకమందలి తుచ్ఛాల నుచ్ఛాలు చేసి, మతానికి మాఢ్యానికి పెట్టని కోటలుగా, శాస్త్రవిజ్ఞానప్రచారానికి ప్రతిబంధకాలుగా, అనవసరాలుగా, పరిత్యజించదగినవిగా చిరకాలానుగత కావ్యధోరణులు మురుగునీటి గుంటలయినవి. నవ్యసాహిత్య పరిషదుద్యమ ఫలితంగా, యీ నీటిగుంట వుపరితలంమట్టుకే చెదిరిందికాని అంతకంటె పెద్దమార్పేమీ కలుగలేదు. వ్యావహారిక భాషోద్యమాన్ని, సులభ కావ్యశైలిని, దేశిచ్ఛందో

రీతులను తొలుదొలత స్వీకరించి, వెనువెంటనే కొద్దికాలానికే వాటి జీవవస్తువును భ్రూణహత్యచేసి, పై పెంకను మట్టుకు నవ్య సాహిత్య పరిషదుద్యమం లోకానికి చూపసాగింది. గురజాడ అప్పారావును రాయప్రోలు సుబ్బారావు; కందుకూరి వీరేశలింగాన్ని పానుగంటి లక్ష్మీనరసింహారావు; గిడుగు రామమూర్తిని విశ్వనాథ సత్యనారాయణ అనుసరించినట్లు మొదట నటించి, వెనువెంటనే ఆ మహనీయమూర్తిత్రయము ప్రారంభించిన అర్థవంతమైన ఉద్యమాల లోని ప్రాణపదార్థాన్ని చంపి, పౌరాతన్యానికి దానితోడి చెదుగులకు తిరిగి వూపిరిపోశారు. కాని వెనువెంటనే మొదలయిన అభ్యుదయరచనోద్యమం కందుకూరి – గిడుగు – గురజాడలకు వారసత్వం స్వీకరించి, ప్రపంచ ప్రజాతంత్ర రచనా సంప్రదాయ ధ్వజాన్ని తెలుగునాట ప్రతిష్ఠించింది. తొలుతొలుత సకల సంప్రదాయ నిరసన శ్రీశ్రీ, నారాయణబాబు, శిష్ట్లావంటి కవులలో కనుపించింది. కాని పోను పోను, యీ విధ్వంసక ధోరణులు పరిత్యజించి, గతంలోని కొద్దిపాటి మంచిని వర్తమాన యుగమందలి శిష్టజీవిత ధోరణులతో మేళవించి, “ప్రాత క్రొత్తల మేలి కలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మగా”రచనలు సాగించవలెనని అభ్యుదయకవులు గ్రహిస్తున్నారు.

పురాతన కావ్యధోరణులలో స్వీకరించదగినవేవి ? అభ్యుదయ రచయితల కేవి లేవో అవి అని జవాబు. సూక్ష్మంగా చెప్పవలెనంటే మొదటిది శబ్దంమీది ప్రభుత. శబ్దాలు ప్రజలు. కవి సామ్రాట్టు. శబ్దాల నడుపులో పెట్టలేని కవిని శబ్దాలు అదుపులో పెట్టగలవు. శబ్దాలంటే పిడుగులు, పాషాణాలు, వడగళ్ళు, సముద్ర తరంగాలవంటి సంస్కృతశబ్దాలేకాదు. శబ్దాలసంఘంలో సంస్కృత శబ్దాలు సంపన్న వర్గానికి చెందినవి; సామాన్యులను మన్నించనివి: సామాన్య దేశి పలుకుబళ్ళను అణచిపెట్టేవి; శుష్కాడంబరంతో కూడినవి. అభ్యుదయకవి వీలైనంతమట్టుకు సంస్కృత శబ్దాల దుష్ప్రభావానికి లోనుకాక, దేశిపలుకుబళ్ళ మెలకువలను ప్రయోగ విధులను సాకల్యంగా తెలిసికోవాలి. అట్లని సంస్కృత శబ్దాలను

పూర్తిగా విడిచివేయడం సాధ్యంకాదు. ఏమంటే అవి నేడు తెలుగులో బహుళంగా వున్నవి. మన భాషలో అంతర్లీనమైపోయి వున్నవి. తిష్టవేసుకొనివున్నవి. ఒక్కొక సందర్భంలో, ఉదాహరణకు, వీర, బీభత్స రసస్ఫూర్తికి, అవి అనవసరం కావచ్చు. రెండవది ఛందస్సు. వట్టిగేయాలు రుచిపచిలేని కూరలవంటివి. జన హృదయంలోనికి చొచ్చుకొనిపోవలెనంటే, గేయానికంటె గీతి పటుతరమైన ఆయుధమని గ్రహించాలి. అభ్యుదయ రచనోద్యమ ప్రారంభ దశలో, సంప్రదాయ నైరాస్యం ప్రబలంగా వుండినప్పుడు, "ఛందో బందోబస్తులను ఛట్ ఫట్ మని" త్రెంచాము. కాని మనం విధ్వంసకులమే కాదు. నిర్మాతలముకూడ. అందుచేత, వస్తువుయొక్క అవసరాని కనుగుణమైన ఛందస్సును మనం స్వీకరించక తప్పదు. శ్రుతి సుభగత్వానికి తోడ్పడేటంతవరకే మనకు ఛందస్సుతో పని. ఛందస్సులోకూడ దేశిచ్ఛందోరీతులనే అభ్యుదయకవులు ఎక్కువగా స్వీకరించవలసివుంటుంది. క్రొత్త క్రొత్త ఫణతులనుకూడ అవసరాల కనుగుణంగా మనం సృష్టించుకొనక తప్పదు.

"అడవి" కావ్యసంపుటిని ప్రచురించిన నాటినుండి "భువన ఘోష" కావ్యసంపుటిని ప్రచురిస్తున్న నేటివరకు, అభ్యుదయ కవిత్వం గురించి నేను వచ్చిన నిర్ణయాలను మనవి చేశాను. అవి నేను అమలు పెట్టచూచాను. ఫలితాల జయాపజయాలను నిర్ణయించేవారు పాఠకులు.

గూడూరు,
జూన్, 1955.

భవదీయుడు,
రమణా రెడ్డి.

# నినాదమ్

మృగ ఘోషలను మించి
సాంద్రములు చించి
కణగోడలను చేయ
వేగం నినాదం

ముష్టి పోదరింట
గులాబీ నినాదం
వ్యాఘ్ర గర్భాన ఒక
బాణం నినాదం

మాతంగనే తురగ
మగు ఇంద్రజాలం
నిర్ధనుల వాదం ని
నాదం నినాదం

అటవిలోపల చిచ్చు
మేఘాన మించు
పౌరుషం పాటలం
రైతు శిల్పి నాదం

వాదం నినాదం వి
వాదం నినాదం
పుష్పం నినాదం
ఉదయం నినాదం

వాహిని నినాదం
వాసన నినాదం
పీరణం తోరణం
హార్తాల్ని నాదం

నీరవం నిశి, మహా
దండకం లోకం
భీతిచే మూర్తి పెగ
లని పిరికి శోకం

అశోకం రణన్నినద
జాగృత ప్రపంచం
రణక్షోణి ధరణి
నినదంబు యోద్ధ

రిథి రథం రధ్యాలు
సారథియు వాహిని
భల్లనుసి తోమరం
వ్యూహం నినాదం

నైద్యం నినాదం
నినాదం సువిద్య
విసగుడు నినాదం
నినాదంబు వేదం

మృదంగం జల త
రంగిణి నినాదం
భంగిమ నినాదం
తాండవం నినదం

హృదయం నినాదం
జీవం నినాదం
నినాదం ప్రకృతి
నినాదంబు గీతి !

★

# శాంతి గీత

## 1

వందన మిదే నాది శ్రీదేవి శాంతి !
గుండెలోతులనుండి కావించుచుంటి;
చింతనముచేసి మరి చే యెత్తుచుంటి;
ఇంతంత వనరాని యీాసు రోసముల
ముంపైన మానవాధోలోకమందు
నుండి నీకే తుదకు కూయెట్టువాడ.

వినమితము లలిత మీా గీతికాస్వనము
కాని కాంస్యపు దుర్గసమను రాణువకు;
మనుసంతతిని మారణముచేయు నూహ
సన్నద్ధముగ నధమ దుష్టరణమునకు
మిన్నులనుముట్టు మృగకంఠాల ఘోష
చిన్నారి నాగీతి నాపగాలేదు.

వినమితము లలిత మీా గీతినిస్వనము
కాని కాంస్యపు దుర్గసమను ఘాంకృతికి;
అనవరత రణపశుత చేతి డమరుకము
శనివోలె మ్రోగి మానవుల చెవుల
నన్నిటిని బధిరముల చేయుగా, నాది
నునుగీతి కర్ణసంజీవ మాయేను.

నిశ్చలముగా నిలచి చూడగా నాకు
నిశ్చయముగా నెత్రువరద కన్పట్టు
పచ్చి నెత్తుటియూట పసినాడి తెగిన

మిసిమితో పసరుతో నురుసుక్రక్కేను
విశ్వాంత జల విలయ కల్లోలమానా!
విశ్రాంతి లేక ప్రతిక్షణము ఘనతరమా!

నిశ్చలముగా నిలచి చెవియొగ్గి వినగ
నిశ్చయము గాఢస్వసుషియూర్పు వినిపించు
విచ్చి పూవులవోలె నున్న డెదముల
చొచ్చి మణిమందిరాంతర్గతంబైన
లసదాత్మజ్యోత్స్నే చెనకగ చూచు,
విశదార్ద్ర వేదికను కలచగా చూచు.

ఏకాకినని నీకు సందేహమేల?
నీకుగా నే నేమి చేయగా లేను!
లోకమే మాయన ట్లెడ్వంగలాడ!
ఇకనైన యెరిగి నను నమ్మకంబిమ్ము;
అకలంక మీ యాత్మ నే నాత్మపరుడ,
ఒకశంక లేక నిను చూడంగలాడ!

నిలువనొల్లను నరుల రక్తశాఖికల
కలయికలచే కశ్మలంబైన కడల!
పాలనొల్లను మాయయే తెలియనట్టి
పాలు జిందెడు నరకుమారు మాంసమున!
తల్లి ఒక్కటె మీకు నాకునూ కనుక
పలవింతు ప్రణయమున సహజన్ములార!

మన బ్రదుకు లన్నియును నిమిష దీర్ఘములు;
దోచెదర దానినే మూఢాత్ములార?
దేనికై మీ రిటుల కీచులాడెదరో
ఘనత యది నశ్వరము ప్రభుత భంగురము!

నూనె కొలఁదీ దివ్వె; దీపికాంచలము
మన మర్త్య జీవితము కడు చంచలమ్ము !

వగపు తడిసిన నాదు మానసంబందు
నిగనిగలతో నెగడు పారిజాతమ్ము
ఎగువగా క్షణభంగురాల పైపైన
నగవుతో మానవుల పాపములు మోపి
బిగువుతో తన మేన సీలలే దిగగ
సగియించె నెవ డతని శిలువపై మొలుచు.

ఆ పారిజాతమ్ము దివ్యకల్పకము;
చూపు కబ్బురమైన నును రెమ్మలందు
ఏపుమీరగ సూర్యపుత్రి చిందాడు;
కొపైన కొమ్మ నును నల్లగుబురందు
అప్సరసలే తూర్యరవము సలిపేరు:
పూపలూ పూవులూ లలిమించగలవు.

శుకములూ పికములూ బుల్బులి సికాద
సకలమూ చిన్నారి సొగసు పిట్టలును
పకపకలతో పాడి కలకలము సేయు
వికసితాకాశమటు పారిజాతమ్ము
సుకుమార కోమల ప్రసవ వర్షముల
సకలావనికి చలువ వెలుగు నిడుగాత !

## 2

ఓ శాంతి ఓ కాంతి ఓ దయానిలయ !
నాశ మ్మాక్రోశమూ విధ్వంసకాండ
ఆశలను నులివేళ్ళనే చెనకుచుండ
మాసిన మ్లాన వసనమ్ము ధరియించి

మసిక్రింది నిప్పుగా శోకము సహించి
పసిమె చెడినట్లు నీరసము చెందేవు !

ఓ శాంతి ఓ కాంతి గంభీరవదన !
నిశ్శ్రేణివలె లేక లోన కలహించు
నీసంపు టలరంపులను ముంచి నీవు
సుశ్రావ్య స్వరమేళ సరిదిద్దుతావు !
అశ్రాంత మామృత్యు మృగస్పర్ధ నణచి
ఆశ్లేష మానంద మధువు నిచ్చేవు !

ఓ శాంతి ఓ కాంతి ప్రాణసంజీవి !
విపనలయముల పోరు నరపశుగణంపు
తృపమాన్పి తులలోన న్యాయమును తూచి
విశ్వప్రశాంతి కాలయము నిర్మించి
నశ్వరముకాని గవాక్షము నమర్చి
భాస్వదాదిత్య ప్రకాశ మిచ్చేవు !

ఓ శాంతి ఓ కాంతి ఓ సత్త్వమహిత !
క్రోశమెత్తున పోవు నొక సుపర్ణుండు
పక్ష ఘన వైశాల్యహేతువున రక్ష
పసిమి పచ్చికబయలు కిచ్చు తానెట్లు,
మిసిమి బంగరు పట్టురెక్కలతో నిమిరి
ఆశీస్సు లిత్తువు ముక్కాలములకు.

ఓ శాంతి ఓ కాంతి మంగళాదేవి !
శ్లేష పు మోదంపు దేవులకు చెల్లి !
రోచిర్మయంబులౌ శంప లంగుళుల
చాచి యక్కల కిచ్చి నడుమ నిలచెదవు !
వీచికలలో శబల గగనమ్ము చూపి
చేసెదవు రెండు నదు లొకటి, కాలువవు.

ఓ శాంతి ఓ కాంతి సమ్మోదజనక !
'నశియించుచున్న దో శరులార మీకు
కసిపట్టివచ్చుగా ముదము, జాగ్రత్త !'
నిసిమించు గుండ్ర నునుచేతులం జూపి
నిసువులను చేస్తె వెదకొమ్ము వ్రూటలకు;
పసివంకితో కొరుకునపుడు నవ్వేవు !

ఓ శాంతి ఓ కాంతి ఓ ఆదిశక్తి !
విసపమీరిన వారి శిరసు వంచెదవు;
పసరు హెచ్చిన కోడె మిడసర మడంచి,
ఈసు పోకుల మోహ వాగురల శక్తి
మసిచేయనీక వెస మరలింతువమ్మ !
వసుమతీదేవి నిధి దర్శించ మనెదు !

ఓ శాంతి ఓ కాంతి ఓ సౌమ్యమూర్తి !
కాశముల బిగియించి ద్వంద్వయుద్ధంబు
రోసంబుతో పోరిపోరి చనుదెంచు
శోషితుల మల్లురను లో జేర్చుకొంచు
కాసింత పాక్షికంబైననూ లేక
వెస నిమురను తనుపు ధర్మంబు నీది !

ఓ శాంతి ఓ కాంతి నునుచివురు నగవ !
వేసంగి సంజెలో ఇంద్రుని ధనస్సు
విశదముగ నీ కనులలో ప్రతిఫలించు;
అశ్రువుల నించుటయె అపచారమౌను
అసదృశంబౌ పావురాల కన్నులకు !
నీ సద్విలాసమే మా రామరక్ష !

ఓ శాంతి ఓ కాంతి వల్లి జాబిల్లి !
పసిపాలవు టపరంజి పీపు నిమిరెదవు,

కసుగాయలను యేరి బొప్పి మాన్పెదవు,
కసరుదెబ్బల చెట్లనుండి తొలగించి
నీ స్పర్శకోటి మావ్యధలు తుడిచెదవు;
మా సర్వమూ బుడగ, నిత్యవాసివి !

(రోమాఁరోలాఁ De Profoundis గీతానుసరణ)

★

# ఉప్పెన

అర్థముక్త లక్షాధిక నిర్ధన
ముఖద్వార మీ కవిత, స్వేచ్ఛా
మఖాగ్నికుండము, సవిత.

మలయా కొరియా దేశాంతరముల
బాధాగాధోద్భూత విలాపము
వెలువరపరచే నలువ, నా కవిత,
సహస్రదళముల కలువ !

పంతం పట్టిన నాలుగు మూలల
నగతొడిగేటి వసంతం, నా కవిత
ననతొడుగు యువస్వాంతం !

చిరాకాంక్షితు మహోన్మీలితం
దరిద్రాపైన ప్రభాతం ;
ఆపలే రెవరు పాటల వూటను
డాగని దీ సంగీతం !

ఉత్తర దక్షిణ దిక్కులు క్రక్కగ
ఉరకలువేసే పసుగుల గ్రక్కున

సుడులు తిరుగుతూ ముడులు విప్పుతూ
గరుడ ఘనాఘన పక్షాంచలముల
అనిర్వార్య కల్లోలం బుల్లం
అప్రతిహత సంగీతప్రఫుల్లం
రకెట్ వేగమున రభటిస్తున్నది
తొలగుడు ప్రక్కకు నియంతలారా,
లేదా, లేచిన మండే వుప్పెన
లో పడి లోబడిపోయెదరు,
జ్వాలనశీల మీ ధూళి,
ఉగ్ర భయంకర కాళి!

ఔరా యెన్నటి కెన్నటి కెన్నటి
కో గద, వచ్చెను హయధాటి!
నరసంతానపు వరప్రసాదము
స్వేచ్ఛాగరుడ పరాక్రమము!

ప్రక్కకు తొలగుము ఓ పశుముఖమా,
జనమే యినుడై దిశాముఖంబున
యుగారంభమున తోచేను
శకారంభమును చాటేను!



# ఎర్ర కాగడా

మహా గమ్యస్థానంవైపు నడుస్తూ
పోరున భీతి నెరుంగము;
విషాద దుఃఖసాగరమున
విధిని ప్రతిఘటించినాము;
విరోధి కత్తి నూరుచునపుడు
శాసనాల దాటినాము;
ధ్వజంపు కెంపు కాంతిక్రింద
కార్మికులను కూర్చినాము;
విశ్వచిత్రపథములోన
తొలిచినాము మహాపథము!

సుదూరయాత్ర కానీ ప్రమాదపూర్ణమేనీ
ప్రపాతముల దాటి రవిప్రభాకోటి చూసి
గూడ మంచుగుండా మబ్బుమాయగుండా
కొరికేచలి కోరకాని గుడ్డివెల్గుకానీ
ఎర్రకాగడాలు పూని ఎగబడిపోతాము
కొండకొమ్ము చివరల కెగబ్రాకి చేరుతాము.

మా బుజజులనుండి జలముల కద్దరిని
దేశాంతర తీరాంచలముల వెల్గెడి ప్రొద్దును
అవలోకిస్తూ నే మభినందిస్తున్నాము:
మాస్కోను మొదలుచేసి న్యూయార్కువరకు సిగుడు
ప్రతిధ్వనించు ఛాహిని అదృశ్యకరము లెత్తి
"రండి రండి భ్రాతలు మా శిబిరం రండి!
జీవితాలకొరకు జీవనాలకొరకు
విశ్వశ్రామికులారా ఒక్కమొగిని నిలచి

రండి రండి నేస్తులు మా శిబిరం రండ”ని
ఉక్కుమాట లంటూ ఆహ్వానిస్తోంది!

దేశాంతర తీరము తీరములో నీరము
దేశాంతర భ్రాతలు భ్రాతలలో గాత్రము
ఆత్మగౌరవము మీరిన మహాప్రజా శక్తులు
గుండె లవియ ప్రతిధ్వనుల గాలికసరు లేపిరి :
ఒంటరిగా లేమురా, జంటలు వున్నాయిరా,
జల మానల చూడరా, ఒకే సంజ్ఞ నిండెరా,
కత్తీ పెను సుత్తీ కొడవలి మరి నాగలీ
గాఢ పరిష్వంగమందు పెనబడినటులాయెరా!



# ప్రస్థాన భేరి

ఖబర్దార్ !
హోషియార్ !

ముందుముందు మహానగం
ముందున్నది
ముందున్నది

మహానగం మహానగం :
రెక్కల పురివిప్పి భయం
కరమహా పాషాణమయం :
కనుమలేని మహానగం
ఎడములేని మహానగం
ముందున్నది
ముందున్నది

పక్షమున్న యే యొక్కటి
ఎక్కిన పొడ తెలియనట్టి
మిట్టిపడే మహానగం
నిక్కినట్టి బృహన్నగం
ముందున్నది
ముందున్నది

మింటితార నిలుచునట్టి
మించులొరసి చీల్చునట్టి
శిఖరంబులు తాల్చునట్టి
మహానగం
మహానగం...ఖబర్దార్ ! హోషియార్ !

ఫణమెత్తిన ఒక్కసగం
ఎగువగ కనలే మేఘం
లోతుల కదలే పిడుగు;
తలవాల్చిన మరోసగం
మీదుగ సాగే నాగం
మూపున కన్నీటి మడుగు:
ఫణామణి ప్రభాతటి
ల్లతా లసన్మహోజ్వాల!
రణాంగణంపు ఘోరవీర
భూరిభేరి ధ్వనిర్ఝల!
మహానగం
మహానగం
ముందున్నది మహానగం...ఖబర్దార్! హోషియార్!

సంభృతమహా స్సాంద్రశిఖా
బహుముఖమై కానసం,

ముహుర్ముహు ర్జ్వాలాపాల
దుర్ముఖమై పేదతనం:
నిప్పులు పెడబొబ్బలు
జబ్బులు వడదెబ్బలు
గబ్బులు క్షయదగ్గులు
మూత్రవ్యాధి దుర్బల సం
తాన వితానమ్ములు
మూర్ఛవ్యాధి దుస్తర సం
సార విచారమ్ములు...ఖబర్దార్ ! హోషియార్ !

తెరిపిలేని వాన
నీరు త్రాగి కాన
నాల నీల పరిసరాల
మ్రింగే రక్కసవ్రాబి
క్రుంగే ధారుణి నాభి:
దిగజారుడు దగాకోరు
తనము పిరికితనము
భద్రదృష్టి హ్రస్వదృష్టి
ఆత్మవర్గ స్వార్థము
శకునపక్షి వక్రభాషి
ఆచరణద్వేషి
సూత్రమాత్ర కుక్షి
దారిచూపు ఒంటికన్ను
ముందు నడచు దొడుకాలు
లేకుంటే మందగొడులు...
ఖబర్దార్ ! హోషియార్ !

స్థిరగమనం దృఢహృదయం
సూక్ష్మదృక్కు నిశిత మేధ

నిజాయతీ నిస్స్వార్థం
వ్యూహంయెడ నొక్క కన్ను
ఫలితంయెడ మరొక కన్ను
రణవిషయ ప్రావీణ్యం
జనవిజయ ప్రాశస్త్యం
గుర్తెరిగిన అగ్రనరుడు
కలిగిన మరి గెలుపు కలుగు!...
ఖబర్దార్ ! హోషియార్ !

ఒకరొక్కరుగ విడివిడిగా
వికసించే శతపత్ర ద
ళక్రమానుసారముగా
నిశ్చలముగ నియతముగా;
గెలుపోటమి పొలిమేరిది:
సుఖస్వర్గద్వారము
యోగ్యులకే ప్రవేశము
సాధకులూ బోధకులూ
సర్వజగత్కల్యాణా
కాంక్షులకే గమ్యము
గజిబిజికీ గడబిడకూ
క్షుద్రక్రోధ దుర్మోహా
సహ్యాభావ దుర్గమము:
చిత్తశుద్ధి లక్ష్యసిద్ధి !
ఇది దాటిన విరివంతెన... !
ఖబర్దార్ ! హోషియార్ !

వెలుగు లేదు
వలెను నడువ !
ఆకర్షణ లేదును,

కణ కణమందున
ఘన ఘర్షణ !
విరిమాలిక చే దాల్చక
దరియబోదు సురకన్యక :
పూవుసెజ్జ లేదు
లేదు ఇస్పకల్లు !
కష్టపరంపరలు, రంప
కోత, కంపశల్యములు,
నిర్బంధము నిరాదరణ
బహుయాతన, బహిష్కరణ...
ఖబర్దార్ ! హోషియార్ !

కండనిండ వుకుకు
గుండెనిండ నిప్పు
కంటి కొసను దివ్వె
ముక్కుకడను ప్రజ్ఞ
కద్దా ? మరి వుకుకు !
కంటిముందు జోయా
జిహ్వపైని ఫ్యూచిక్
హృదయమందు భగవత్
సింగు వెనుక ఆజాద్
కలరా ? వురివురుకు !...
ఖబర్దార్ ! హోషియార్ !

కాలిక్రింద యెముకలపొడి
రక్త బంధువులదా ?
ఎదలోపల ఎదిగే కసి
రక్తాన్నపు భోక్తపై !
రక్తమందు రగిలే వుసి

సాహసికాంకములకై !
ఒళ్ళే జ్వర వజ్రాసి
శత్రువు లిక సమసి, మసి ! ...
ఖబర్దార్ ! హోషియార్ !

ఓయి పరంతపుడా
ఓరి విశ్వకర్మా
పురోగమనశీలీ
సత్య సాధుశీలీ
అతుల దృఢశాలీ
నిత్య విజయకేళీ
ఒహో మానవాళీ
ఒహో మానవాళీ ... ఖబర్దార్ ! హోషియార్ !



## వజ్రహాసం

తెలంగాణ నవ
తెలంగాణ నన !

తెలంగాణ కనుబొమ్మలు సంధ్యలు
తెలంగాణ కనుపాపలు పడగలు
తెలంగాణ పెనుకాయము కాంస్యము
తెలంగాణ జనకార్యము వీర్యము
తెలంగాణ జవనాశ్వము సింహము
తెలంగాణ సమరాంగణ ప్రాంతము
తెలంగాణ విన్యాసము విలయము
తెలంగాణ వుత్సాహము ఊహము
తెలంగాణ కరవాలము శూలము
తెలంగాణ గళనాదము శంఖము !

* * *

యాదవరెడ్డీ కొమరయ్యా
కామ్రేడ్ లక్ష్మీనరసయ్యా
రఘుపతిరెడ్డీ మేరయ్యా
చిన్నారెడ్డీ ఎల్లయ్యా
పాపయ్యా మల్లయ్యా
సామ్యూలూ లింగయ్యా
దస్తగిరీ వినాయకయ్యా
కొమరయ్యా అమరయ్యా
కాంతయ్యా అనంతయ్యా
సమాకాంక్షులై కపోతాక్షులై
నిటాలాక్షులై ధర్మపక్షులై
వేనకు వేలై వేలై వేలై
వీరుల చాలై చాలై చాలై
వేలై కోళ్లై చాలై జాలై
దళాలు బాకులు సింహవాహినులు
గోదావరులై గర్వోన్నతులై
ఎత్తిన శిఖరాల్ లాల్ బావుటాల్
లాల్ బావుటాల్ పాటల పత్రాల్ !
లాల్ బావుటాల్ తుషారావృతాల్ !
చూచిన దృక్కుల్ ఎర్రటి దివిటీ
లెత్తిన పంథాల్ మోదుగ మొగ్గలు
విత్తిన పంథాల్ పగడపు దివ్వెలు
పట్టిన పంథాల్ !
పలికిన పలుకులు ఎత్తిన ఎల్గుల్
ములుకులు తూపులు శూలాలు సవాల్ !
గుండెలు గ్రెనేడ్లు కండలు కంకర
నాడులు తంత్రులు వజ్రా లస్థులు
దేహీ ప్రతి యొకడు దేవ సన్నిభుడు
అగ్నిస్కంధుడు మరి గీర్వాణియు !

వీరిని పాతిన పాతర పెళ్ళలు
త్రుళ్ళి తునిగినై పెల్లు కదలినై.
వీరిని లాగిన త్రాళ్ళు త్రాచులై
మ్రాడగబ్బలై ప్రాకులాడినై.
చర్మం వూడిన నరాలు వూడిన
శవాలు శతాలు అస్థిపంజరాల్
లేచి తిరిగినై విశృంఖలాలై యముడి దూతలై
లేచిన స్తంభాల్ పెను రాకఁబాల్
విరాట ఖగరా డ్విశాల పక్షా లుదగ్రవక్షాల్
ఎదురు తిరిగినై బెదుః మరచినై తిరిగి కరచినై
రక్తపు రేఖలు అగణ్య శిఖలై హిరణ్య ముఖులై
శిఖలు నాల్కలై నాల్క చీల్కలై చీల్క కీలలై
కీల లెగసినై, కీల లెగయగా నాల్క లొకటిగా
కీల లెగయగా చుట్టుముట్టగా చప్పరించగా
జ్వాలామాలా కీలాభీలం బాహాబాహీ
జగడం జగడం!
జనాల సమ్మెలు ప్రదర్శనములూ కాల్పులు
కూల్పులు సమ్మర్దములూ
ధ్వజారోహణోత్సవ సంరంభాల్
అమోఘ మగణ్య మగాధ బింబాల్ !

* * *

కనీనికలు యువ కపోతమ్ములై
హిమ ధవళములై సుమ సంఘములై
చీకటి కోనల కానల వెలుపల
కూశటి నరాల సరాల వెలుపల
ఒక విజ్ఞానం ఒక విక్రాంతి
ఒక అధ్యాయము వేరొక్క సంస్కృతి
కానల వెలుపల ఒక కాసారం

సుఖ సంసారం :
కనక కమల కల్హార విలసితం
మధుప మధుపడా గాన ఘూర్ణితం !
తెలంగాణ ప్రతి గుడిసె కప్పుపై
గుడిసె కొప్పుపై గుడిసె కొమ్ముపై
తామ్రచూడు డొక డెక్కి నిక్కి తల,
రోజాపూవే చేరినటుల, లేదా, దినమణి
పుదయమటుల నై, ముక్తకంఠుడై ప్రబోధింపగా
వృక్షం దేశం సస్యం ప్రసవం
ప్రాణం మానం ఆత్మగౌరవం
బీడూ బంజరు గొడ్డూ గాదీ
సకలం త్వరితం విముక్తి తరుణం !
ఇపు డాసన్నం వర్షాకాలం
ఇపు డాపన్నం గతహేమంతం
ఇపు డుద్భూతం చైత్రోత్సాహం
హరితలాంగులం తరుణ కోమలం !
ఇపుడు జాగృతం గ్రీష్మప్రతాపం
తీక్ష్ణం తీవ్రం అప్రధృష్యం !
వీర సాంద్ర కిమ్మీర శోభితం
ఘన కోదండం నవ తెలగాణం !
భుజోద్ధూత విక్రాంతం వజ్రం
భీమ గదాదండం తెలగాణం !

*　　　*　　　*

ఉదిత సామ్య సంధ్యారుణ వర్ణా
ముదిత సామ్య వర్షాంబుద చేతన
హసిత సామ్య సౌదామినీ కేతన !
నూతన పర్ణా శోణితవర్ణా
భరతభూషణా ఓ తెలగాణా !

సైఁ సైఁ సైఁమని సైఁమని సైఁమని
రైఁ రైఁ రైఁమని రైఁమని రైఁమని
సైఁమని రైఁమని రైఁమని సైఁమని
ఖస్సుఖస్సురని బుస్సుబుస్సుమని
కనలి కనలి కను లురలి యురలి, వగ
లొలిచి తొలిచి, పగ పిలిచి కలచి, బిగి
నిలచి గెలిచెదవు, గెలిచి నిలచెదవు,
పసువు నిలిపెదవు, వ్రాడ దించెదవు,
నీడ పరచెదవు, చక్క దిద్దెదవు,
తరణీ తరుణీ మనోహారిణీ
విప్లవ వాణీ త్యాగఖనీ జననీ!

★

# శ్రావ్యత్రవు

చరిత్ర :

ఎన్ని యెన్ని పోరాటపు ప్రేవులు నా గర్భములో
ఎన్ని యెన్ని ప్రజాబహుళ జయనాదా లెడందలో,
నే నోహో యీ జనావళికి పత్నిని!
వాస్తవాల నీలినదుల చిరుతరగలు మా శిశువులు
నిత్య సత్య చైతన్యమె పచ్చని మా వంశము
వాడి వేడి కత్తి అంచు మా సరసము
ధారణమే మా గుణమ్ము
సాధారణమే మా ప్రసక్తి
రణమే మా శక్తి యుక్తి
వీరణమే రక్తి!
మాసిన అనాది రేక మొదలుగా
అనంత కాంతి లోకమునకు యానము

ఎగుడు దిగుడుకై నిలువము
నిత్య స్వాతంత్ర్యము ధ్యేయము!
జన మజేయము
జగ మ్మమరము!
చరిత్ర కర్క-శస్వనము
విననివారు మనరు,
విన్నవారు చెడరు!

ప్ర బో ధ వా ణి :

తెలంగాణ సరంగులార!
అరివేశ్యా భుజంగులార!
విప్లవ జలధారలు మీ
భుజములపై పొరలుసుమీ!
వైద్యుతసిత కాంతిచ్ఛట
శిరములపై రుద్రజట
భారత మొక వృద్ధ వట
వృక్షము, సుడిగాడ్పు మీరు !
హేమంత ఋతు దురంత
ద్యుమణిచ్ఛవి మీరట
వాసంతీ సుఖ విలసిత
జీవిత సంఘాతలట !
విద్యున్మాళాలా మీ నాదులు,
రౌద్ర భయంకర ఝుంఝూ
ప్రచాలనమ్మున ఓడలు ?
మసి నుసి నూదిన నిప్పులు
ఊరమ్మలు డప్పులు ?
చప్పట్లు కనక తప్పెట్లు
కంఠాలు పాంచజన్యాలు ?

కక్కు కలుకు వీడిపోని
కోత కొడవ లెత్తి
భీమ గదా ఘనదండపు
పెనుసుత్తుల నెత్తి
బానిసలను పీనుగలను
అర్భకులను అబలలనూ
మనుషులుగా వీరులుగా
కదిపి కలిపి చచ్చు దులిపి
ప్రబుద్ధులను కావింపుడు
ప్రజాధ్వజం కీలింపుడు !

పరిస్థితి:

రండి పోకండిరా, ఆజ్ఞ యిది ప్రజ్ఞ,
రండి పోరండిరా, లేకున్న అవజ్ఞ !
రండి చేరండిరా, ఆజ్ఞ యిది ప్రజ్ఞ,
రండి చెండండిరా, పీడితుల సంజ్ఞ !
నోరెత్తి హోరెత్తి రండి పోరండి
చేయెత్తి చేయెత్తి రండి పోరండి
తొడ దట్టి సిగ బట్టి చెండి పోరండి !
అధికార దుర్నీతి త్రెంపె గట్లన్నీ
శాసనాలన్నీ, సాంప్రదాయాల్నీ
న్యాయసభలన్నీ, ధర్మశాస్త్రాల్నీ,
రండి పోకండి, యీ గండి నింపండి !

ఓయోసి వేవేల కెంపుగములారా
రంపపళ్ళారా !
కంటి లోపల నిప్పు రొమ్ములపై డప్పు
వేవేల చేజేతు లాడించి జోడ్చి
రండి పోరండి పోరండి పోరండి !

తోడేళ్ళ పొటేళ్ళ సఖ్య మేమిటిది
చిరతలకు రయితులకు నేస్త మెన్నటిది ?
తాపులకు భయమొ తలతీపులకు భయమో
అప్పుపత్రాలకూ ఆడుమానాలకూ
ఆడజీవాలకూ అరువులకు భయమా ?
భయముతో నూరేళ్లు జీవించుకంటె
మీ ఆదకువుపై నొక క్షణ మమూల్యమ్ము.

డంజన్లలో నెట్టి గుంజిళ్ళు పెట్టించి
చెరల లోపల పెట్టి గుగ్గిళ్ళు మేపించి
రచ్చముందర నిలిపి జప్తుచేయించి
ఎవ్వ రితరుల నేడ్చునట్లు చేశారో
ఎవరు పస్తులకు కారకులు నయ్యారో
ఎవరు బీదరికాని కాదకువు లైరో
వారి జీవా లధమాధమా ల్గావా!

మీ లేమిమీదనే కలిమి బ్రదికేను
మీ గోడుమీదనే బంగారుగోడ
మీ యేడ్పుపై వారి ఆగభోగాలు :
నల్లబారిన తోలు చేవదేరింది
ఎర్రబారిన నెత్తు రావేశ మన్నా
ఎగురవేసిన బావుటా సర్వ మన్నా!

రోషాలు ద్వేషాలు కావు దోషాలు
రండి పోకండి పోరండి సుతులారా
దాస్యమో మోక్షమో నిశ్చయించండి
లెక్కించనగు మీనమేషాలు లేవు
భస్మాసురుడు మీకు ప్రభువయా నేడు
బకుల కెందరికో పోషణకర్త వాడు!

నిశ్చయించం ఔకను నిర్ధరించండి
నల్లతోలుకు క్రింద కెంపు కలదయ్యా
బక్కచిక్కిన గుండె గాండ్రించునయ్యా
నల్లపాపకు లోన తెంపు కలదయ్యా
అమ్ముల్లపోయి తొత్తులు అగుటకంటె
అభిమానమున శిరము విరిగినా బాగు!

స్త్రీ లు :

మా శీలపు ఢక్కామజ్లీ
నొలిచిన ఓ దుశ్శాసనుడా
మా పాపల నెత్తురు షర్బతు
పీల్చిన ఓ కంసాధ్వంసా
సుప్రశాంత జీవసరసి
కలచిన ఓ ఛింగిజ్ ఖానూ
నీ రాజ్యము మా భోజ్యమురా !
పాచ్ఛాలు కదూ తమరు
మా మానాచ్ఛాదనాల నొలిపింతురు !
మీర్జా లోహారో మీరలు
జనపదాల గాండ్రింతురు !
దేశముఖులు మీ కేమి
నఖాలతో నెత్తురు తోడుతారు !

ఆగండి రాకండి ఎదురు నిలువండి
తే తెండి వడిసెలలు రాలు రువ్వండి
పోపొండి మిరపపొడి కళ్ళ కుప్పండి
కాల్చండి లారీలు గోరీలు పూడ్చండి
మృత్యువే మనము శవతాండవము నేడు !

పురుషులు :

సూర్యాపేట బాలేములు మేము లేమి మీాదు కలిమి!
కాని యిపుడు నిలచి మనుడు :
నేలకు బలి మీా తల
నూతికి బలి మీా మొుల !
భ్రాంతి పోయి క్రాంతి, మత్తు పోయి జుత్తు
చేతికి దొరికిం దిప్పుడు ! తప్పుడు మాటల చప్పుడు
భ్రాంతి పోయి క్రాంతి !
గాంధీ పేరిట మీారై బ్రాందీ పోయించారు
ఇస్లాం పేరిట మీారై గల్లా నింపేశారు;
మా నేతల చిత్రవధలు
మీా చేతుల జరుగగా
నేడే మీా బలవన్మృతి
మా చేతుల జరుగదో ?
తిరుగుబాటు బావుటాల
కొాకే బాస నే డిట
పడీ లేచి గెలుస్తాము
మా భూముల పేరిట !

అందరు :

కండ లరుగ అందరం
వంగి పాటుపడితిమి
అంగుళమున చెమ్మట
మడుగులుగా కూడగా !

క్రిందు మీాదు తెలియక
వంత చింత లెరుగక
మందిరాల మండపాల
రాంబందులు కులకగా ! ॥ కండ లరుగ అందరం ॥

కుక్కమంచ మొక్కటి
బిక్క ముఖాలన్నియు
కుక్కజన్మ నయమయు
పుకుగుకూడ మెరుగయా! ॥క్రింది మీాదు తెలియక॥

దుక్కి బతుకు మాకట
చిక్కి పసులమేసట
అప్ప టా శిస్తట
వెట్టిచాకిరీయట ! ॥ కుక్కమంచ మొక్కటి ॥

కొడుకు కలిగినపుడట
బహుమతీయవలెనట
గంజిలేక ఆకట మా
పాపపోయినపుడటా

పూడ్చు ఖర్చు లేదట
కాల్చు ఖర్చు లేదట
ఇట్టి దెచట వింటిరి
వందలేళ్ళు మోస్తిమి ॥క్రింది మీాదు తెలియక॥

బానిసలుగ బతుకుటా? ఛీ
బానిసలుగ గతుకుటా? ఛ త్
బానిసలుగ పుట్టి, మెట్టి
బానిసలుగ గిట్టుటా?

కవి :

కనలి కనలి ఒక అగ్నికొండ గా
భిల్లున విరిగిందా
ఫెళ్ళెళ్ళని విరిగిందా – సై

జరిగి జరిగి మిణ్ణాగుబాము చూ
రుకు్కన కరచిందా
చిక్కగ కరచిందా - సైఁ
ఏడ్చి యేడ్చి ఒక కోటికళ్లు శా
పాలు కురిసినాయా
రాలు కురిసినాయా - సైఁ
అరిగి అరిగి ఒక ఆకురాయి తా
టీల్మని మండిందా - సైఁ
తళ్లళ మండిందా - సైఁ
జలజలజలమని వానలో సై
తళ్లళ్లని మెరుమురా సై
మెరుమురా ఒరి
ఉరుముశా - సై!
మబ్బు చాటు విడి చంద్రుడూ-సై
పసిమిదేరి కొడవాలిరా-సై
నిగ్గుదీరి ఉర్రిత్రాడోయి!

ఆలు మగలు కలిసీ మెరసి వేనవేలు
చేలు సొంతపరచీ నేల స్వాక్రమించి
భూమి బొరియలోనీ చీమపుట్ట పిగిలి
నీటిపాము శవమూ నమలివేసెననగా,

చదువు నేర్చినవారు కొందరా-అహాఁ
పాడ నేర్చినవారు కొందరా-ఒహాఁ
నడుప నేర్చినవారు కొందరా-సైఁ-షో
రాడ నేర్చినవారు అందరా! భళి!
భళాభళానోసి తెలగాణీ
వీరపుత్రుల గన్న మహారాణీ!

కన్నీటి లోవలో చీకటుల త్రోవలో
మెరసిన తార దవ్వుదవ్వులకు పోవా
దవ్వులకు పోవ
పలకాటి సీమలో రాగులక సీమలో
ఎగిరిన ధ్వజపు గాడ్పు దవ్వులకు పోవా
దవ్వులకు పోవ
పలనాటి గుండెలో ప్రాణాగ్ని రగులా
ప్రాణాగ్ని రగుల
లంకసీమల రాత్రి తెలదెలా పోవా
తెలదెలా పోవ
కోనసీమల కోతిగుంపు వణుకంగా
గుంపు వణుకంగ
సర్వాంధ్ర భూతలమునం దొకకాంతీ
మహావజ్ర కాంతి!

రాత్రి :

సామాన్యుని వెనకు శ్రీమంతుని కొరకు
దొంగసాకుతో వచ్చి దొంగకు మద్దతిచ్చి
చిత్రహింస మలుపెట్టి వసుమతిని మూటకట్టి
పరిసరపు నవ్వులార్పి చీకట్ల రాసి నెరపి
పాపాత్ము డవతరించె దినమణిని సంహరించె.

చరిత్ర :

పిరికి ముఖులు కెదురుతిరిగి నిలిచా వో నైజాం
నైజాముల కెదుర్త్రొక్కి మనుతా నో సైతాన్!
అనాది మంచుగుబులు చీల్చి
అనంత భాను వీధికి నా పయనం...
ఎన్నిఎన్ని పోరాటపు ప్రేవ్రులు నా గర్భములో

ఎన్ని ఎన్ని ప్రజావిజయ ప్రతినాదా లెడందలో
నే నోహో యీ జనావళికి పన్నిని!

చరిత్రకారుడు :

శ్రావణాకాశాన మిరుమిట్లు గొలిపి
శిశిరమున నునుకెంపు చివురులను తొడిగి
భాస్వంతమైన తెలంగాణ తారా
ఓ కాంతిధారా!
మలు సంజె పెదిమలో క్షణమాత్ర మెట్టులో
నిగనిగ ల్నిలిపినా విదియ శశిరేఖా
శ్రావ్యాశ్రు పల్లవిత కల్పతరుశాఖా!
వృద్ధ భారతకుటుంబాన యువమూర్తీ
ఓ విశ్వకీర్తీ!
ఓసి భారతమణీ వైష్ణవ్యవాణీ
చిరమై యశము నీకు నగవగునుగాక!



# రక్తాశ్రువు

ఓ చల్లపల్లి నారాయణరాయా
లంకసీమకె ఆహుతైనావా
రంకు రాత్రికి గావు అయినావా
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

ఎర్రటి యెండల వుచ్చున తగిలిన
భూమిని మాడ్చే భీకర గ్రీష్మము
దప్పికగొన్నా పచ్చచేలపై
మిడిమిడి మంటలు కురిసే వేళల

ప్రకృతి పురుషులు కంచుకాకలో
ఉచ్చులు త్రెంచుకు వురికే వేళల–
నిరంకుశత్వము పడమటిగాడ్పై
సెగలను వగలను వీచే వేళల–

కాల నియమముల నావల ద్రోసీ
చివురు రాలు దుష్కాలపు వేళల–

అకస్మాత్తుగా మబ్బుమాయగా
మల్లెపూల తడి గాడ్పులు వీచీ
ఉల్లాసపు సౌరభాలు విరిసీ
ఆశలు అసువులు మోసులెత్తగా
మోళ్ళూ బీళ్ళూ శిరసులెత్తగా
వర్షకాభ్రమై వెలసినావయా
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

మేఘం క్రమ్మగ పిడుగు దొర్లగా
వియద్విప్లవం వ్యాపించంగా
చేనిలోనా తోటలోనా
లంకసీమ పోరాటమందునా

నీ ప్రతాపమె బావుటాగా
నీ ప్రకాశమె కాగడాగా
సాహచర్యం ఆసరగా
నోటి మాటే ఆదరువుగా

ఉసిగా పురిగా పుత్సాహంగా
సరిగా గురిగా సన్మార్గంగా
ఆశలు రేపిన బాటలు చూపిన
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

వసంత మెవరికి విరియాలంటివి
ఎవ రేలికలై యేలాలంటివి
గౌరవపరులై స్వేచ్ఛాయుతులై
ఎవ్వరు సుఖాలు కుడువాలంటివి

పుత్ర పౌత్ర సౌభాగ్యా లెవరికి
పచ్చతోరణాం పెళ్లిమంటపం
ఎక్కడనైతే నిలుపాలంటివి
జ్ఞానభాస్కరుడు వెలుగాలంటివి
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

తలలు తరిగే బాసనీళ్ళకు
లంకసీమలు పురుడు పోస్తే
తలలమానికమంటి నీకూ
వన్నెలుసగా లేదో యన్నా!

పాదరస మనుకొంటి నయ్యా
చిక్కబో వనుకొంటి తండ్రీ
ఇంద్రజాలం వచ్చునను కొంటి
కన్గట్టు విద్యలు తెలుసు ననుకొంటీ

అయ్యో! చేజిలో తూ
పాకి లేదా
గుండెకు లోనా వైరం లేదా
బొందిలో జీవాలు వుండగా
ఎవ్వరయ్యా నిన్ను పట్టారూ?
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

అయినా ఏమిక? సాగును పూనిక!
ఎక్కడైతె నీ నెత్తురు రోజా
నేలకు కావి తావి నిచ్చెనో
ఎక్కడైతే నీ దేహంభూధరము
నేలకు బల్మి కల్మి నిచ్చెనో

నిత్యమల్లె పూవువంటి
కంబ మొక టచట నిలుపుతామయా
కబ్బాలెన్నో అల్లుతామయా
మల్లుతాన్లనే పరుస్తామయా
కుస్తీ కసరత్ ఆటల పోటీ
లన్నీ అక్కడ జరుపుతామయా
ఓ...చల్లపల్లి నారాయణరాయా...

అర్ధమ రాతిరివేళ యెప్పుడో
బొబ్బరింత వినిపించిందంటే
వాతావరణం ప్రకంపించితే -
అడుగో బెబ్బులి చల్లపల్లి నా

రాయణరావే లేచాడందును
ఎగిశాడందును పొడిచాడందును !

తాటికట్టవల చాలు వెనకా
ప్రొద్దు కరకరా మన్నదంటే
తూరుపు కప్పురపారతి యైతే
అదుగో సూర్యుడు చల్లపల్లి నా
రాయణరా వుదయించా డందును
చీకటి గొంగై వచ్చా డందును !

వాన కురిసే దిక్కులో ఒకా
ఇంద్రధనుసు గన విరిసిందంటే
రంగుల వంతెన తోచిందంటే -
అదుగో ఇంద్రుడు చల్లపల్లి నా
రాయణరావే వెలిశాడందును
మళ్ళీ మాలో నిలిచా డందును !

సప్తవర్ణములు సప్తాశ్వములై
దినమణి మళ్ళీ వచ్చాడందును !
వర్షుకాభ్రమే ఐరావతమై
వజ్రి మనకుగా వచ్చాడందును !

అదటున గోరీ శయ్య విదల్చుక
తుపాకి పట్టుక దివ్వెలు కట్టుక
భుజాలు ధ్వజాలు ఎత్తుక ఎత్తుక
రథా లాయుధాల్ పూన్చుక తాల్చుక

శయ్య విదల్చుక త్యాగుల పిల్చుక
కంఠాల్ శంఖాల్ ఎత్తుక ఒత్తుక

రొమ్ములు చరచుక కొమ్ముల నొత్తుక
దండు మెండుగా చేరిందంటే
గర్జిలి గాండ్రిలి ఘీంకరించితే

ఉరకలు వేస్తూ పరుగులు తీస్తూ
గంతీ గెంతీ బొబ్బలు పెట్టీ
రుసరుసమంటూ బుసబుసమంటూ
వైరిని పట్టుక గదమాయిస్తూ
దండు మెండుగా సాగిందంటే
జయం మింట మార్మ్రోగిందంటే
తుఫాను టైఫూన్ రేగిందంటే

క్రోధారుణ నేత్రాలు తరగలై
గర్వోన్నత శిఖరాలు పడగలై
దండు మెండుగా సాగిందంటే
అదుగో పహారా! చల్లపల్లి ది
క్సూచీ యంత్రం సుముఖం బందును !
అదుగో ఛత్రం! చల్లపల్లి దృ
జ్వాలికలందున జ్యోతులు కందుము !
అదే లవిత్రం! చల్లపల్లి వా
క్ఛంకారవముల సిద్ధులు కందుము !



# దశోన్మాది చిత్రపటం

## 1

"నీ వెంత ?," అని తుస్కాయించకు; అమ్మో
నియంత యీతడు !
కొమ్ములు మొలిచిన తలలో
అమ్ములు ముంగురు లితనికి,
మారణాస్త్ర తుణీరం మేధ !
తుటారియించ కీతనిని :
తుటారిగాడు [1], వీ డొక డూడరి [2] !
కోరలు పెరిగిన నోటికి
నరక్రిము లశనం వీనికి,
సింగపు గుహ అంగిలి :
అతకరించ కీయనను,
దూకుడుగాడు వీ డొక దమి [3] !

## 2

చక్కటి పీనుగలాగున
నిక్కిన నియంత యీాయన,
జగ మీాతని కాష్ఠము !
మెడ తిరుగదు,
తలా మెడా ఏకము !
మాంసలుండు కనుక వీడు
మనిసి తిండి మెకము :
జగము బకుని బండి !

---

1 పౌరుషము కలవాడు, 2 దుర్మార్గుడు, 3 అణచువాడు.

ఈయన కీయనే పతాక
ఈయన కీయనే సలాక!
వీడు నరవాహనుడు కాక?
కుబేరుండు వీడు
జగ మీతని పాతర!
సర్వాంగీణము సవాయి
శని యీతని తాయి!

3

ఈయన కీయనే సాటి
ఈయన కీయనే పోటి,
ధాటిలోపల కిరీటి:
జగ మీతని చేటి!
కన్బొమ చూశావా?
బొమ ముడి బొబ్బమేకము కైవడి;
గొంతుక విన్నావా?
ధ్వని, ధర్షించే ఘోరాశని!
ఎడద లేని యితగాడు
జగ ్రమింగుడుగాడు!
బాం బీతని నడుగు, నెత్రు
చీము వీని పడిశెము!

4

ధరాతలం మీద నిఠారుగా
నిలుచుని, అనగా బాహుగా
నరుల తలలమీాది కాలుగా,
వియత్తలంనైపు చూడు వేడిగా
ప్రసరిస్తూ, అనగా వాడిగా
కెంపుతూపు ప్రయోగిస్తూ

యోచిస్తున్నా వేమిటి ?
"మిన్ను మన్నుకూడ త్రవ్వి
నా ముంగిట తోలిస్తే,
మిన్ను తొలచి చుక్కరవల
కిరీటాన తాపిస్తే,
మిన్నేటిని తిరుగతోడి
శ్మశానాల పారిస్తే,
స్థలావకాశము సైతము
కార్ఖానా చోటయితే,
గగనపు ఘన నీలవస్త్ర
మమ్మి పరుస నింపేస్తే..."

5

విపత్తులు చురకత్తులు ధరా
తలంలో పొలంలో విత్తి,
శరీరాల ప్రమిదలలో వెలిగే
అభిమానపు టగరువత్తి త్రుంచి,
కదిలితే మరి వెను దిరుగని
రాంబాణాలవంటి పాషాణపు
మనో-రథాలమీాదు కపాల
ధ్వజుడై స్వప్నిస్తూ,
వియ ద్వీప త్తలాల నాశిస్తూ,
దురాశల పాపపు పంట నుస్తూ
జనపదాలు నిర్జన విపినం చేస్తూ'

6

స్వర్గ క్షితి కన్ను గుట్టి
ఎర్ర తార కెసరు పెట్టి
ప్రజ మెడలకు బండ కట్టి

యుద్ధపు కూపమున నెట్టి
లాభాలకు కోట కట్టి
పాపాలకు పాక కట్టి
అవినీతికి అడవి నిచ్చి
ద్వేషాలకు దప్పి తీర్చి
చావు జీర్ణశక్తి పెంచి
విశ్వ విలయ వ్యూహానికి
కపాలాల గుత్తు లెట్టి
రక్తనదుల హద్దు కట్టి
భూగోళము చుట్టుముట్టి
గాని విరతి నందబోడు.

7

కనుక, మిత్రమా, వీడు
హిరణ్యాక్షుడికి జోడు!
కాని పేరు పెట్టుకోడు,
పైకి చాల మంచివాడు!
మతమంటే చాల ప్రీతి
సాటిలేని దైవభక్తి!
ప్రజాతంత్ర సూత్ర భాష్య
కారుడు, కడు నిస్స్వార్థుడు,
విద్యకొరకు వేయి కోట్లు
వ్యయము చేయ వెనుదీయడు,
పరదేశికి కడుపాకలి
యన్న, కనుల కారు జాలి!
దుర్బలులకు రామరక్ష!
దాస్యమన్న ఘోర కక్ష!

8

ఈయన దుస్తర దయవలననే కదా, సౌగదా,
యంత్ర సహస్రాలు పరిభ్రమిస్తుండుట !
యంత్రాలు భ్రమిస్తుండుటవలననే కదా, యేమి,
లక్షాధిక శ్రామికులు బ్రతుక గలుగుతుండుట !
వారు సంతృప్తు లయినందుచేతనే కదా, కాదా,
పితూరీలు పొడసూపకుండుట !
పితూరీల పొడ జాడకూడ లేనందువలననే కదా,
శాంతి సర్వత్ర సామ్రాజ్య మేలుతుండుట !

9

ఆహా, మిత్రమా, యీాయన
సాక్షా ద్విష్ణుమూర్తి కే యైన !
ఈతని సేవలోనే కద్దు
కైవల్యం అందరిది;
ఈతని కోవలోనే కద్దు
అందరిదీ వైకుంఠం !
ఘనుని పాదపూజలోనే కదా
సామాన్యుల సాయుజ్యము !
ఈతని మాట వినకపోయావా,
మరి అనుభవిస్తావు రౌరవం !
రౌరవం ఎక్కడో కాదు:
ఈయన తలుచుకున్నాడా,
నీ యిల్లే రౌరవం కాగలదు !
నీకు తిండి నిరాకరిస్తాడు,
సాయం రానంటాడు,
నీవారినే నీపై తోలుతాడు,
గూఢచారులను నియమిస్తాడు,

గృహ కలహం ప్రేరేపుతాడు,
అరాచకం పేరిట తన
సేనలు దిగుమతి చేస్తాడు:
అందరికీ అంకుశం !
తాను నిరంకుశుడు !
అందరికీ దారిద్ర్యం !
తా నొకడే శ్రీపతి !

10

కాని అయ్యల కయ్యా, క్షమించు:
యము నంతటి నియంతా, మృత్యువంత హంతా,
మన్నించు: నే నొక మానవ క్రిమిని:
కనుకనే మేధ స్సంపన్నుణ్ణి:
నీ ధూప దీప నైవేద్యాల మత్తుకు
నీవు యెగసన్రదోసే చితిమంట కముకు కంపుకు
నీ పెంచిన కలరా క్రిమి చంపిన సోదర శవాల క్రుళ్లుకు
నీ పంచిన పుస్తకాల పుస్తుకు
మూర్ఛిల్ల దది, జాగరూకమై వున్నది,
వర్ధమాన మవుతున్నది :
మేధావృద్ధికి సూచన సందేహ స్ఫురణ !
దేనినీ ఆమోదించదు, ప్రతిదానినీ ప్రశ్నిస్తుంది,
తాను తృప్తిపడిన పిమ్మటనే ఆమోదించగలదు !
అల్పుని యీ అనుమానాలను నివృత్తిచేయుడి,
ఆపై, బాగుండేయెడల, వశంవర్తి నవుతాను !

11

"యంత్రాలు పొదుగుతున్నవి దేనిని ?
వికసన విలాసాలకు విరోధి యేది ?
నియంతలకు పరిధి, ఆపై గోరీ యేది ?

సంస్కృతికి సరళ జీవనానికి పరశు వేది?
ఆరోగ్యానికి ఆనందానికి శవపేటిక యేది?
మూక మరణానికి రహదారీ యేది?"

12

అన్నింటికీ "యుద్ధ" మని కదా జవాబు?
కానైతే కాదు, "శాంతి!" అని అంటావేమి?
ఐనా, నీ యేకాక్షరికి ఎన్నెన్ని భాష్యాలు!
నీ పుస్తుగురించి యెన్నెన్ని పుస్తకాలు!
నీ నోటి గబ్బు దాచేటందు కెన్నెన్ని కబ్బాలు!
నీ పటాటోపపు పేకమేడ కెన్నెన్ని కంబాలు?
దేశీయ నియంతల ప్రాంతీయ నియంతల స్రష్టా!
అన్నన్నా, నీ బిరుదులూడిపోనూ, నీ చేయిపడిపోనూ,
ఎంత తప్పిదం చేశావన్నా?
బుద్ధి గడ్డితినిందా జ్యేష్ఠా!

13

సాధారణ ధారణశక్తి కూడ లేని మ్రుచ్చుగోరల[1]
కడపటివున్నాద ధోరణి మాకుపేరు రణం!
అసాధారణ నర మారణశక్తి మీ ధీమా;
కాని చేయించే వచ్చారా జీవితాలు భీమా?
నిన్న పొడిచిన ప్రొద్దీవేళకూడ పొడుస్తుంది
మీ అన్యాయాల అధ్యాయాలు
సర్వం సమాప్త మంటుంది
గద్దెనుండి దించి బోనులో నిలుపుతుంది
మీ ఘోర వధకు సాక్షిగ నిలుస్తుంది
జన ఘన విజయాన్ని పునశ్చరిస్తుంది
శాంతి పట్టాభిషేకం చూస్తుంది.

---

1 గజదొంగ

## లెనిన్

నమో తమ శ్చమూ హంత!
నమో భానుమంత!
నమో న్నమో నరోత్తమా!
నమో విశ్వకర్మ! భర్మ
భావిజగద్ధర్మ!
నమో భువన భవనదీప్తి!
బుద్ధి వృద్ధమూర్తి!
నమో బుద్ధ! నమో సిద్ధ!
భావి శిశు శ్రద్ధ!
నమో స్రష్ట! సామ్య నిష్ఠ!
నమో దూరద్రష్ట!

★

## లెనిన్

"ఏడిరా నీ లెనిన్
ఎక్కడున్నాడు?"

"నెత్తుకు కన్నీకు చెమట
నీరుపారు వనులు వదలి
ఎముకలు మసి నుసి చిమ్మట
పేరుకొనిన గనులు వదలి

"దాస్య శైత్య శైశిరమ్ము
క్రౌర్య దూష్యమహా రాత్రము
నిరంకుశము ప్రజాపీడ
సామ్రాజ్యవాద ఘోరకాండ

"శవములు పెట్టే శాపము
శరములు నెట్టే పాపము
కుక్కలు చెంచులు కోతులు
నరులను చంపే రీతులు

"వదలి వదలి లెనిన్ కదలి
శాంతి వైపు పొంగి పొరలి
తుష్టి వైపు పుష్టి వైపు
వేడి వెలుగు ఋతువు వైపు

"యువ హృదయమ్ముల పక్షాల్
పర్ణాంచిత పతాకలై
పరాధీన హిమతుషార
వర్షవారి హత పత్రాల్

"పునర్జీవవంతాలై
వికసింపగ వాసింపగ
అటు నిటు నెల్లెడ తొల్లిటి
విస్మృత చైత్రము విరియగ

"ఈడుచు పోవును ముందుకు
విస్తృత జయ పర్ణమ్ములు
కప్పెడు స్వర్ణాంబు వర్ణముల
సుపర్ణుడై కర్ణధారి."

* * *

"ఎవడురా నీ లెనిన్
దేవుడా నరుడా!"

"వర్గాల వైరాల కడపటి పరీక్ష
శిక్షకుల శిక్ష

పాలకుల పీడకుల చీడలకు పీడ
తన ఒంటి నీడ

"ఈ గోడపై ప్రచార పత్రమ్మూ
ఈ పుస్తకమ్మూ
నమ్మే పేరున్నూ నభల రూపున్నూ
హార్తాళులున్నూ

"తమ శక్తి గుర్తెరిగి వ్యక్తులై ప్రజలు
సమష్టి ప్రజలు
చేయు ప్రతి యొక స్వల్ప ముక్తి కార్యమ్మూ
అన్నియూ నతడే !

"ఆకలికి చావులూ వ్యర్థ భోగాలు
తాపులూ తన్నులూ మూత్ర రోగాలు
లేనట్టి భూస్వర్గ భవన నిర్మాత
భావి నర చారిత్ర గతికి నిర్ణేత

"మంచివా టన్నింటి డాలు
విజ్ఞాన సంస్కృతీ నిధులు
అతని హృది కంచు డప్పు
అతని నయనము గొప్ప నిప్పు

"వే వేల జే జే నినాదాల నడి గురి
కే కేలు జోడించి నిలువబెట్టిన గిరి
ఒక యుగం ఒక శకం ఒక క్రొత్త కత
చిరకాల వ్యధల నిష్కరుణంపు వధ !

"ప్రతి యొక ఆకలియాత్రకు మహాజరు
ప్రతి ప్రదర్శన మందున హాజరు
చనుపులోనూ లెనిన్
ఎరుపులో మా లెనిన్

"పీడితులు నడుపు అతి భీషణపు ప్రతి యనిన్
ఉసిగొల్పి పురివెట్టి పుత్సాహపరచును లెనిన్
లెనిన్ నారసింహము
లెనిన్ నాదస్వరము.

"దివ్యుడు కాడు దివ్యా
దివ్యుడు కాడు
సామాన్యుడునూ కా డత
డసామాన్య నరుడు, నరోత్తముడు !

"శిక్షణ
విశ్వ సంస్కృతీ రక్షణ
విజ్ఞాన వ్యాప్తి
లెనిన్‌గారి సూక్తి !

"శీలము
సత్య సంగీతము
పీడితుల గెలుపు
లెనిన్‌గారి పిలుపు !

"కాంతి
భ్రాంతి పరిసమాప్తి
శాంతి
లెనిన్ చేతి శక్తి !

"వర్గాల పగలు
సర్పాలుగా పోరు రాత్రి
గడువగా పట్టపగలు
లెనిన్‌గారి నొగలు"



# స్టాలిన్ అస్తమయం

ఏలోయి కను దోయి చెమ్మగిలుతుంది
ఎందులకు గొంతులకు యిట్టి గద్గదిక
ఏమి టిది నీదు హృది ఘూర్ణిల్లుతుంది
ఏలొకో లోకంపు సొకు నసి చెడెను ?

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

చెమ్మగిలి నయనాలు నిర్ఝరిణు లౌనో
గద్గదికతో గొంతు జలపాత మౌనో
ఘూర్ణిల్లి హృదయాలు దంభోళు లౌనో
సొకు చెడి లోకాలు నీరసపడేనో !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

మౌనమే తనలోన కుళ్ళి యేడ్చినది
శూన్యమే తనకు దా కుమిలిపోయినది
నరలోక విషయ మిక మరి చెప్పవలెనా
పితృ మృతి దుఃఖాన సహభాగులైరి !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

వాగ్మి వాచస్పతియు బోధకుడు నేత
జన వాహినీ పతియు సాధకుడు త్రాత

తార్కికుడు తాత్త్వికుడు నిర్మాణ చణుడు
విడచి చనె చనిపోయె రే వెలుం గారె !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

తన మెదటి గూటి అర దేశమెుక టయ్యా
అరల లోపల క్రొత్త సంగతు లనెన్నో
ఎన్నో ఆలోచనలు పథకా లవెన్నో
పెచ్చి మెదటిని నేతునాడి తెంపినవి !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

ఎవరి కృషి ఫలితము పోరంబోకు పొలము
వసుమతీదేవిగా పరిణమించినదో
ఎవని పథకపు ఫలము పుష్కలము జలము
తిండినీ తీరికను కలిగించి పోగా

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

రైతు బిడ్డడు రాజసము డాయె కాదా
సన్న జనమే చక్రవర్తి కాలేదా
పొలము సైదోడు కార్ఖాన రాలేదా
సర్వము స్వయం పుష్ట శ్రీ రేఖ కాదా ?

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

గగనాన పావురము క్రింద జలచరము
భూమిపై జీవులకు వంతపాడేనో ?

శాంతి శతపత్రంపు రక్తాదళమ్ము
ముకుళితమ్మైపోవ నడుగంటిపోవ

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

చైనాయు చైలీయు మాస్కోయు మద్రాస్
కికుయూలూ కోయలూ కిప్లాయు క్యూరీ
లోకం సమస్తం అంధాశ్రు బంధం
ఏకైక సంతాప బహుమూర్తి మంతం !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

ఆర్చువా రెవ్వ రోదార్చువా రెవరు
తీర్చువా రెవరు విడమర్చువా రెవరు
ఎరుగమిని పోకార్చి ఎరుక నిచ్చేరు
తెలియమిని చెండాడి తెలివి చేసేరు ?

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

ఆర్చువా డాతడే తీర్చువా డతడే
ఆయనే నాయనే యిట్లాయె నయ్యో
ఇట్లాయె నెట్లోయి ఎట్లోసి యెట్లు
గుండెలే కుంపట్లు కళ్లు సెలయేళ్ళు !

అపారం విచారం బనంతంబు శోకం
సముద్రం విలాపం బాకసం ఖేదం !

★

# స్టాలిన్ అస్తమయం

ఏఁరా ఎండా దించు నీ జండా
నీ కంచుజండా

మొనగాడు పోయాడు
వెలుగారిపోయాడు
వెలుగారిపోయాడు
బ్రతుకార్పిపోయాడు
పోయాడు నేడు మి
త్రుడు గురుడు మంత్రి !
నీ వేల యీవేళ, పో పొమ్ము భానూ,
రావె హంత్రీ, అస్థి వీణె తంత్రులను
మ్రోగించు, మొరగించు, త్రెంచునటు మీటు:
నరలోక బాంధవుడు మరి లేడు చూడు,
స్వైరిణీ, నీదె పో, యేలుకో క్రోలుకో !
యుద్ధమా సంఘాత మరణమా మేలుకో
జాంతవారణ్యమా కోలుకో వేల్కో !
లేడుగా మీ వైరి పట్టి పల్లార్చగా
వేయి కన్నుల వెదకి పసిబట్టి చంపగా,
వేడుకలు మీకు మరి, మాకు కుతకుతలు
వెతలు వేదనలు రోదనలు రంపములు !
ఏఁరా ఎండా దించు నీ జండా
నీ కంచుజండా !
ఏఁవేఁ మబ్బా కప్పు నీ దుబ్బా
నీ నల్ల దుబ్బా
జగజెట్టి పోయాడు
వగ నిచ్చి పోయాడు

వగ నిచ్చి పోయాడు
వల్లకా డిచ్చాడు
వా డేల మిగులులే
శవ్రులం మేములే !
రావె రాత్రీ ర క్తసుమ కఠినగాత్రీ
నీదె యావద్ధాత్రి, నేడు శివరాత్రి !
మమ్ము వుద్వాహమై రతిదాహమై మోహ
బీభత్సమై భీకరానంద మారంద
మత్తమై మూర్ఛిల్లి మృత్యువల్లీ బంధ
నముల మమ్ముల కట్టి నట్టింటి దీపమ్ము
నార్పి కన్నులు లేని కూపమున త్రోయించి
గాఢ్పనే ఏడ్పుగా వెలుగులను మూల్గుగా
మార్పించెదవుగాని, సంసిద్ధులము మేము ;
మా కొద్దు యీ పగలు, దిగులు గుబులై నాగు
చరకొట్టినటు తరిమినటు గాటు కా
టందినటు భయమగును !
నిర్నిద్రమై బాధ మమ్ము వేటాడునే,
కలవుగా నీవు, చేపల పట్టు వలవుగా
పట్టు, నీ బుట్టలో పెట్టు, నిదురించెదము,
కలలు కానుకపెట్టు, వెతలు మరిచేటట్టు
రా రావె శైల సుకుమారి మహమారి !



# తుఫాను పిట్ట

తళ తళ తరళించే వెండి బయలువంటి విస్తృత జలనిధి మీదుగ
ప్రబల మారుతం
జలధర శ్రేణిని సమ్మర్దం సంసిద్ధం చేస్తోవుంది.

జలనిధికీ జలధరాలకూ నడుమ అసిత కాంతిచ్ఛటవలె
పొగరెక్కిన తుఫానుపిట్ట ఒకటి
వలయరీతిగా విలయావర్తంగా విహరిస్తోవుంది విపరీతంగా.

రెక్కతో అల తల నిమురుతూవుంది లాలింపుగా ఒకమారు;
రివ్వురివ్వున బాణమై బలవత్తర మేఘాలను చీల్చుక
కఠోరంగా భీషణంగా కూస్తో పోతూవుంది.

పరిశోధించినై మేఘాలు
సాహసికమైన తద్భీషణ రణన్నాదంలో
ఏదో పారవశ్యం, వివశత్వం!

తుఫానుకొరకాక్రోశిస్తూ వున్నట్టున్న దా కూత
ధ్వనిస్తున్న దా మ్రోత
ఆవేశాన్ని ఆగ్రహాన్ని అంతిమ విజయ విశ్వాసాన్ని పలుకుతోన్నది.

భయంతో నీటికాకులు మూల్గుతూ, నీటిపై అంగలు చాపుతూ,
సిరావంటి సంద్రపు టగాధాలకు చొచ్చుకుపోయి
భయాలను దాచుకుంటున్నై.

మూల్గుతున్నై నీటికోళ్లుకూడ పోరాట పారవశ్య మనవసరం తమకు
పిడుగు పడిన ఫెళఫెళార్భటికి
దిగ్భ్రాంత మైపోతున్నై.

శిలారంధ్రాలలో నాలికలు దూర్చి భయవివశాలై
వికృతాంగాలను కుంచుకుని కుంచుకొని
ముడుగుకుంటున్నై నీటిబాతులు.

కాని
నిర్భయంగా నిర్భరానందంతో విహరిస్తోవుంది తుఫానుపిట్ట
వెండి నీటిమీద.

క్రిందికి క్రిందికి నల్లనల్లగా దిగబడి సాగర సామీప్యానికి
వస్తున్నై దాడిగా కారుగా
పుష్కరావర్తక మేఘాలు !

మీదికి మీదికి ఎగబడి మేఘౌన్నత్యాలకు పోతున్నై
కారుగా నేరుగా తరగలు
పిడుగులకోసం ఆక్రోశంతో ఆవేశిస్తో ఆర్భాటిస్తో.

ఫెళ్
ఫెళ్ ఫెళ్
ఫెళ్ళేలా ఫెళా...!

దుర్భరమై జలధరం జలదమై
పటపట పగిలిపోయింది
సంకుల సమరం నీటికీ గాలికీ.

దురావేశ ప్రోద్బలంచేత రాక్షస పరిష్వంగాన
బంధించి నీటిని ఒడిసిపట్టి గాడ్పు
ఒక్క పెట్టున విసరి గిరాటుకొట్టగా, దుర్బలజలం
శిఖరాల పర్యంతం తూలిపడి వికలమై విహ్వలిస్తో వుంది.

అసిత ప్రభాపుంజంవలె భాసిస్తో విక్రమిస్తో అరుస్తో
అమ్మైమ్మ మబ్బుల కోస్తో, నీళుల చీలుస్తో, గాడ్పుల దూస్తో
పోతోవుంది తుపాను పిట్ట ఆక్రోశిస్తో.

వర్ష పిశాచివలె విహరిస్తోంది. నవ్వుతో
జలధరాలను చూసి
ఆవేశిస్తో కూస్తో.

అశని అలసిపోయినదని తెలుసుకొన్న దీ గడుసు దయ్యం
గ్రహించింది యీ మబ్బు మాయ లడ్డజాలవని ప్రచండుని.
జలం గర్జిస్తోంది, అశని అంగలారుస్తోంది.

విశాల జల సముదయ తలమ్మీదు నీల జ్వాలిక
గుప్పుమన్నది. మండే వాలుగలు మునిగినై సమసి.
భుజంగ ప్రతిరూపాలు అగోచరమౌతున్నై గిజగిజలాడి.

వర్షం! మేఘుడు దుర్బలు డౌతున్నాడు, జలం
దుర్భరమౌతున్నది!
వర్షం!

ప్రభాపటలిలో యింకా చంక్రమిస్తోవుంది
గాండ్రించే ఘూర్ణమాన సాగరమ్మీద
ఉన్మాదినియై పోతూనేవుంది తుఫాను పిట్ట.

విజయ మనివార్యమనే ప్రవక్తృ వచనంలోని సముత్సాహం
వినబడుతోన్నది
దాని కూతలో.

సర్వశక్తమై సర్వాంశాప్రపూర్ణమైన వర్షమా
వర్షించు!
అడ్డూ ఆపూ అలుపూ నిలుపూ లేక!

చటుల తరంగ భీకర సాగర హృదయమ్మీద
ఉల్లోల కల్లోలమయిన జలరాశి వక్షమ్మీద
వర్షమా, సంవర్తించు!

(గోర్కీ– Stormy Petrel భావానుసరణ)



# మృత్యుంజయ గీతి

చూపు పోగలంత మేర
లోహము శిల్పతి యొకకడ:
మీదను మిడిసే మిన్నులు;
నిరామయము నిర్వసనము
శీతాకాలపు గగనము :

మృత్యుమందిరపు పహారా
దారుల మిరువురము
మాతుది కొరకే కాచుకు కూ
ర్చొని వున్నాము,
ఉంటే దొమ్మలు నైరికి !

మృతి, భీతీ, మా నలుగడ :
కానీ నిర్భీకులము;
జన ధైర్యము స్పందించును
మాయందున, జనహృదయము
కల్పించెను త్రాణ :

మృత్యుమందిరపు పహారా
దారుల మిరువురము
మీతుదినుండే మిమ్ముల
రక్షిస్తాం వస్తూ
ఉన్నాం సాహసపరులము !

మీదూ క్రిందూ లక్షల
త్రొక్కిడి వింటున్నాము;

లక్షలు మా పక్షం!
జీవమున్నవారు, శత్రు
హతుల ప్రతిహతులు -

మృత్యుమందిరపు పహారా
దారులపుడు వుండరు కుర్చీలో
చావురాక వేచి!

(జనవరి 11, 1953 న సింగ్‌సాంగ్ చెరలో ఎథెల్ రోజెన్‌బర్గ్ వ్రాసిన గీతికానువాదము)



# ఆంధ్రకవిత్వ చరిత్ర

ఇక నా చెప్పేది వినండి
వీనులార నేనతి నవీన కవినండి
ఇక నావిప్పేది కనండి
కన్నులార, యివి నికరపు సరుకులండి!

పెద్దన్నల చిన్నయ్యల కాలం కాలమయింది
తేలిక నుడిపోయి తెనుగుమణుగు నాలుకయింది
సీసాలూ తగరాలూ ముతకబొంతలయ్యాయి
వృత్తాలూ బంధాలూ కొత్తవింత లయ్యాయి
కోకిలలూ శార్దూలాలూ మురికి కంతలయ్యాయి
భుజంగాలూ తురంగాలూ చిగిర్చిన తలవిదిల్చాయి

రాయలూ మనుమసిద్ధీ దాటి పోయారు
నీలాద్రీ యాచేంద్రాదులు ధాటి వచ్చారు
పోతనతోబాటు భక్తీవిరక్తీ పోయింది

శ్రీనాథునితో రక్తీ ఆసక్తీ మొదలైంది
పెద్దనతోబాటు సౌందర్యం లాలిత్యం పోయింది
భీమనతో తిట్టూ ఒట్టూ మొదలైంది

దీనారటంకారాల మాటుకవుల ధనుష్టంకారాలు
విలాసాలమాటు గలాటాలు విశిష్టతకు మారుభ్రష్టత
రసైకసిద్ధిలో సార్థక్యంపొందిన కళాకాయలకు మారహంకారులు
వాచస్పతులకు మారు వాజమ్మలు, సామర్థ్యానికిమారు దర్పం
అహర్పతికిమారు అమవస ప్రతిబింబించిన వృద్ధదర్పణాలు
సాముగరిడీలు, మాటపట్టింపులు, రెట్టింపులు, రంపులు

సాహిత్యం సాని అయింది కవులు తాబేదారులు
సాహిత్యం వృత్తి అయింది కవులంతా బికారులు
కవులు తాబేదారులు తెనుగుకైత తాబేలు.
కవిత్వం శాస్త్రమైతే శాస్త్రులే కవులయ్యారు
బంధింపబడి గ్రంధం దుర్గంధపూరితమయింది
నిందింపబడి కావ్యం గ్రామ్యేతర హతమయింది

అప్పుడు పుట్టాడయ్యా గురజాడ అప్పారావనే అగ్గి
అందుకే చీకటుల జాడవెనుక వుండిపోయింది బుగ్గి
ఆయన ప్రసాదించాడు తెనుగు నుడికారపు నును తేలిక
రాచి రంపాన పెట్టాడాయన తాబేలు డొప్పను
ఆశ్చర్యం, తాబేలు తటిల్మని కుందేలయింది,
మత్తేభం క్షణంలో జవనాశ్వమయింది

సౌజన్యం సంగీతం యిచ్చాడు వాయువూ వాసనా విసిరాడు
సౌలభ్యం సౌందర్యం చూపాడు సూక్ష్మం నునిశితం చేశాడు
గొప్పను డప్పుకొట్టుకొనే గిరీశం, వాజమ్మ వెంకటేశం,
సాని ఐనా సాధ్వీమధురవాణి, పిచ్చిపిల్ల బుచ్చమ్మ,
వేరుకుళ్ళిన మీనాక్షి, లుబ్ధావధాన్లు, కరటకశాస్త్రుల్లు,
కానిస్టేబు, పొట్రిగాపు పంతులు–వీరందరి నిచ్చాడు

మట్టినికాదోయ్, మానవులను ప్రేమించమన్నాడు
స్వయంపుష్టమనుజాతి సృష్టిపథం చూపెట్టాడు
ఐకమత్యం సహనం సంపన్మార్గం సన్మార్గం చాటాడు
వర్ణాన్నీ వర్గాన్నీపట్టి నెలలు కట్టవద్దన్నాడు
మనసునూ మంచినీ కొలమానాలుగా విధించాడు
సూక్ష్మంలో సమస్తంచూపాడు సమస్తమందు సూక్ష్మం చూపాడు

వీరేశలింగము వీరావేశం సంఘాన్నీ సంస్కృతినీ ఆవేశించింది
గిడుగువారి పిడుగు పారుష్యం బడుగును బాడబం చేసింది
చిలకమర్తివారి చలువ పందిరికి క్రింద నవ్యనాణ్యాలు ప్రిదిలాయి
తిరుపతి వెంకటేశ్వరుల ప్రతిభ శరభ శార్దూలాలను పొదిగింది
సర్వం జగన్నాథమయింది తెనుగు వెలుగుకు బాలారిష్టాలు
రాజులేని అంతర్దశ అవతరించింది పండితుల ప్రమాణదండాలు

అప్పుడుపుట్టింది రాయప్రోలు అనేరభస
దేశ ప్రాంత కుల రాజాభిమానాలతో కావ్యం రాసభమయింది
అభిమానాలను పద్యంలోదూర్చి హేతువును పిడకలలోకాల్చి
మొదటికే మోసం తెచ్చింది రాయప్రోలు వేసం
కాని నిజాముసేవ దైవమెరుగు, నీల్నాద్రిసేవ కంటె మెరుగు
స్వేచ్ఛనా మంత్రించాడు రాయప్రోలు, అదే మనకు పదివేలు

ఆస్వేచ్ఛ నిజామేచ్ఛకావచ్చును, కాని అది రెండచ్చరాల చిచ్చు:
అది చెదలును హరించింది, ప్రజలను వరించింది
రాయలప్రోలునుండి యీరాయప్రోలు బండి (అవును రెండెడ్లబండి)
ఆరుస్తూ ఓరుస్తూ అబ్బూరూ దువ్వూరూదాటి
నానానారాయణల కుళ్లుగడ్డి బీడుమీదుగ
చేరింది చేరువయిన దేవులపల్లి.

దేవులపల్లి దేవుళ్ళ కెదురుమళ్ళి
నిషిద్ధ పూజా కుసుమాలు గిల్లి
పాటల పరాగాలు కలయజల్లి

గర్భమంటపంలోపల నగ్నోర్వశీ ప్రతిమ ప్రతిష్ఠించి
నిర్జీవాశయ కల్పిత మిథ్యా మృత్యుమోహిని నూహించి
ఊర్వశి ప్రాకుసీమలోని పుట్టుమచ్చను తలంచి

దాని కాలిగోటిని నోటివుమ్మిని బాహుమూల పలితరోమాన్ని
తనలోనే తలచి తలచి తలపెంచి విలపించి, తపించి,
కన్నీరు మున్నీరుగ కురిపించిగాని నిమ్మళపడలేదు
రంగులు పూసుకొని కొంగులు రాచుకొని
ఏడ్చిఏడ్చి బొంగురుపోయిన రోజులలో
కావ్యాల ధాతుకరవు యేర్పడినప్పుడు

ప్రేయసి బూడిదనుసి పున్నమనిసిగా చిత్రించి
ఉంగరాల ముడులతో గడుసెక్కిన గ్లిజరిన్
కన్నీటిమడుగు చెడునీటినిమట్టుకే వెచ్చించి
కృశా కృశాంగిని బొమ్మమల్లె కన్నీళుల
నీలిచెరువు నసలే ముట్టలేదు, నయం.
అహాపు సుడిలో గిజగిజలాడి సమాజదుఃఖం చూడలేదు.

ఘీంకరించి హుంకరించి నేరుగా జీవిత
పద్మవ్యూహమయిన పాపపంకపు టగాధాలకు
పద్మాలు రత్నరాసులు కొరకుఊలోయీాది శ్రీశ్రీ
అడ్డుపడిన సైంధవాల నదలిస్తూ దిగి
క్రుంగివున్న సామాన్యునిపైకెత్తి కన్నభూమిపై పెట్టి
శిఖరానికి దారి తెలిపి నింగినీలిమలో ధ్వజంచూపి

రణాంగణమందు నారిబిగించి భేరీమ్రోగించి
ఏడ్చేవారిని కవ్వించి గోరీమిట్టలో మంటరగిలించి
గాడ్పువలె గర్జవలెగదిమి గోడకు తుపాకిమడిమనదిమి
ఇంతలో సింగాలను పొదిగి వారికే పోరాటముడిగి
జారిపోయాడు శ్రీశ్రీ పడమట క్రుంగిపోయాడు
వార్ధక్యం చూడలేదు, యువయుగ భానుడు !

★

# శ్రీ శ్రీ

పాడుతా శ్రీ శ్రీ గురించి
మీటుతా వందన విపంచి!

అంచనా వేయాలనంటే
అందరూ జేకొట్టినట్టే;
అంచనా వేయాలనంటే
అందలం ఎక్కించినట్టే;
అంచనా వేయాలనంటే
అంబరం కొలిపించినట్టే;

అంచనా వేయలేమాతని
చలచ్చంచల దీప్తలేఖని
దీప్తలేఖని దివ్యలేఖని
అశనిలోపల ఘన మహాగ్నిని
అవనిలోగిటి ద్రవమహార్చిని
అంచనా వేయలేమాతని
అగ్నులొలికే వజ్రపాణిని! ॥ పాడుతా శ్రీ... ॥

కవులు కవులని యిరుతెరంగులు,
మాలకాకులుకూడ కవులే?
ఉష్ట్రపక్షులు గ్రుడ్లగూబలు
వృథోన్మాదులుకూడ కవులే?
వారు కవులగుయెడ శ్రీ శ్రీ
కాడు కవి, కనుకనే వారలు
పాడుకవియని పరిహసింతురు;
మట్టిబుర్రలు వెక్కిరిస్తే

పోవునది యేముంది శ్రీ శ్రీ
దెబ్బలకు దెబ్బలకు తూలడు;
కాడు దీనుడు: మహాసత్త్వుడు
స్వయం భాస్వద్భానుమంతుడు ॥ పాడుతా శ్రీ... ॥

మాయదాయల రాయప్రోలులు
విషభుజంగాల్ విశ్వనాథలు
కవుల 'కులపతు' 'లేకరాట్టు'లు
కలిసినా, అతడప్రధృష్యుడు !
మతము దేశము వారి చేతుల
గత దురావేశముగ చెడినవి :
రిక్తకౌగిలి రాయప్రోలుది
కత్తికౌగిలి విశ్వనాథది:
ఒకట మనుజులు మిగులుపడ, వే
రొకట కోతులు మనుజులాయెను:
శిథిల విద్యానగర వైభవ
మొకరు యేడ్వగ, ఒకరు కోసం
పునస్సృష్టికి రచనసేతుకు:
కవన దుస్థితిపాలి యమ దూ
తగ శ్రీశ్రీ అవతరించెను;
జరాజర్జరితాంధ్ర వాఙ్మయ
పునర్యవ్వన శ్రీ శ్రీ శ్రీ ॥ పాడుతా శ్రీ... ॥

రసము పౌరుష పాటవంబును
లుప్తమైచను పద్యనాడుల
గద్యలోపలి గర్జదూరిచి,
నడకహుందా నగిషి నేర్పరి
తనముపోయిన గద్యముక్కున
కవనగతమూ కదము దూరిచి,

పద్యగద్యోద్వాహ వైభవ
శుభారంభకుడాయె శ్రీశ్రీ ॥ పాడుతా శ్రీ ...॥

ఆచారంనుంచి ఆచార్యులనుంచి
కులపతులు సభాపతుల నతిక్రమించి

మందగమనంనుంచి గంధచందనంనుంచి
మదకుంజరాస్థి పంజరాల నదలించి

ప్రేతాత్మల కిష్కింధల నతిక్రమించి గమించి
భీతాత్ముల గుత్తిజుత్తు అత్తరుమత్తుల నడంచి

వివాదవిరోధాలు వివిధ వాగ్యుద్ధాల బద్ధాలనుంచి
మడుల మడుగుల మురికి మోసాలను తరించి

పండిత మహామహోపాధ్యాయుల గుత్త చెత్తనుంచి
గదులచెదలు విదల్చి మదులగదులు త్రెంచి

కవిత్వపు సత్త్వాన్ని
విత్తాన్ని విత్తనాన్ని
కాపాడినవాడు
పాడినవాడు శ్రీ శ్రీ

దూరాలుగమించి భారాలు వహించి
వరదలూ బురదలూ అధిక్రమించి
శిరినీ చక్రినీ పులినీ కొడవలినీ చేరి
సభలూ సంరంభా లుత్సవా లుత్సాహాలూ చీరి

కవిత్వపు సత్త్వాన్ని
విత్తాన్ని విత్తనాన్ని
కొని తెచ్చినవాడు
ఇచ్చినవాడు శ్రీ శ్రీ ॥ పాడుతా శ్రీ... ॥

మొదలుననలుగ నడుమకనుమగ
తుదల సత్త్వనిచ్చు తొనలుగ
చెరకుగడవలె భీమగదవలె
అతనికవనము చురుకుమొనవలె !
కాలపాశము కార్తి కేయము
పాశుపతమూ విష్ణుజ్వరమూ
పరశువూ ప్రాంశువూ పగడము
పిడుగుజడివలె అతని క్రొన్నుడి ! ॥పాడుతా శ్రీ...॥

నన్నయకువలె విత్తువేయగ
గున్నసింగా లెత్తివచ్చెను
అప్పరాయని దాగిచూపగ
నిప్పువలె చెంగలువవిచ్చెను
తర్కమూ ఛందమూ రంగర
నర్కుడూ అర్చులూ పల్కెను
అడుగుకూ పిడుగుకూ నడుమను
పాటలో పాటవము పెట్టెను
బుద్ధికీ సిద్ధికీ నడుమను
పదము పాటల వర్ణమాయెను
రాత్రికీ ధాత్రికీ నడుమను
దారిలో అరుణిమలు పరచెను ॥పాడుతా శ్రీ...॥

అంతరంలో కృష్ణపక్షికి
చూపులో పోలికే యితనికి:
మనిషి మనసున గదులుచూడడు
మనిషినీ మనిషినీ యెంచడు
మూకలనుగానీ గ్రహించడు;
సంధ్యవలె సతమతంబయ్యే
జీవితాలకు వుపకరించడు:

కారణం, ఆయనే సంధ్యా
వారి వర్ణపు టపరఖండం,
ఆయనే సందేహసంశయ
చలచ్చంచల మేఘశకలం ! ॥ పాడుతా శ్రీ . . .॥

పక్షిభాషలు పచ్చిఘోషలు
అలలకలకల శిలలవిలవిల
గుండెదడదడ కండగడగడ:
చరాచరముల సకల జిహ్వల
కొకేకక శ్రీశ్రీయె గొంతుక:
గొంతుబాకా గుండెతప్పెట:
మూగమనసుల నోటియాసట

పాటలా శ్రీ శ్రీ వి ? కావవి
గాడ్పులో గర్జలా యేడ్పులా !
మాటలా ఆయనవి ? కావని
బరిసెలో బాకులా తుపాకులా ! ॥పాడుతా శ్రీ. . .॥

క్షణం నిలువడు నిలిచిగెలువడు
గెలిచినా వెనుదిరిగి చూడడు
గెలుపులన్నీ కూర్చినూర్చడు:
గమనమేశీలం, శ్రీ శ్రీ
మది భాగీరథి !
సిద్ధిఫల విజ్ఞాన ఖండా
లన్ని కూర్చుక పార్శ్వవర్తుల
మెదడునింపక మహోగ్రంబుగ
పొంగిముందుకు దూర్లిపోయే
సాగర తరంగం మనోరంగం
అరబీతురంగం మనోరంగం ॥ పాడుతా శ్రీ . . .॥

గుప్తబింబపు మందరశ్ములు
రాలపై బడి రత్నభ్రమనిడి
కాళనిసిలో వేలశశులగు :
మరలవేగున తరళ కిరణుడు
విరియబూసిన గులాబీవలె
కనులబడునని మనసుచెప్పును;
ఏళ్లునలభై నిండుకుంటే
నిండుకోనీ, అతను ఆమని !
పుటలునూరే నింపుకుంటే
ఏమిపోయెను; అతను ఒకఖని !
చెట్లుకొడితే చెట్లుపొదిగే
వనమ్మాతని కవనము !
జీవమేశీలం, శ్రీ శ్రీ
అజరామరార్క-శ్రీ !



# ఆత్మగీతి

నీతినీ రీతినీ అతికి నాగీతి
శుకియొకతె పికియొకతె
వేరొకతె కికి !

శబ్దంబు నర్థంబు రంగారి గీతి
బడియొకతె మడియొకతె
వేరొకతె సుడి !

కాఠిన్య సారళ్యములుకలసి గీతి
గర్జించునొకటి యాషాఢాంబుధరము
కురియు వేరొకటి శ్రావ్యశ్రావణాశ్రులను !

కోపించునొకటి సంతాపించునొకటి
నవ్వొకటి యేడ్పొకటి వేరొకటి యూహ
కలయొకటి నిజమొకటి, వేరొకటి రెండు !

హితవు చెప్పుటకు చాలదు నేడు మెతవు;
ముదిమి కలిగియు జనమింకనూ శిశువు;
ప్రియవాదికల నడుమ యేడ్పువున్నాది;
తూర్య ఘోషల నడుమ పూర్పులున్నాయి.

బాధించగావలెను బోధించవలెననిన;
నచ్చగా చెప్పుటకు దెప్పుతప్పనిసరి;
నయమార్గ మెపుడేని నిష్ఫలంబయిన
దండించగాజూతు దంభోళివాడి !

డోళ్లు పిస్టళ్లు వడగళ్లు గీతములు
సెలలు వడిసెలలు తూరుపు దిక్కు
తెల దెలలు !

పూలు ఒకచేతిలో, వేరొకట మంట,
ద్వేషమొక కన్గొనసను, వేరొకట ప్రేమ,
ద్వంద్వమూర్తిని నేను, పున్నారి నాదు;
సర్వమంగళ కొంత, కొంతరుద్రుడను,
వెరసి రెండిటిగమ్య మేకైకమౌను :
నిర్ధరింపనులేను నిర్వచనమీను :
అందరూఅన్నింటి నడ్డంకిలేక
నీతిగా నియతముగ ననుభవించంగ
వలెననెడు సూక్తి నమ్మెడు వాడనేను:
ఆ లక్ష్యసిద్ధికే యే పథము సుగమ
మట్టిదానినె నేను పయనింతు, శేష
సర్వప్రపంచకము నాకు తోడౌను !

